10. భృగుషట్క దోషం : ముహూర్తమునకు 6వ యింట శుక్రుడుండరాదు. అది దాంపత్య భంగకరమని తెలియవలెను.

11. సగ్రహ చంద్రదోషం : చంద్రు డితర గ్రహములు వేనితోనూ కల్సియుండరాదు. ఏలనగా, ముహూర్త సమయమునకు చంద్రుడు రవితో కలిసినచో దరిద్రము, కుజుడు కూడిన మృత్యు భీతి, బుధసంబంధీకుడైన సంతానహీనతా, కష్టములు, గురుసంయోగమున ధననష్టాదులు, శుక్ర సంపర్కంవల్ల భార్యా విరోధము, ఎడబాటు, శనితో కలయిక వలన దరిద్రము కలుగును. అందుచే చంద్రుడు ఏ గ్రహముతోటీ కలవకుండునట్లు చూడవలెను.

12. జామిత్రస్థానం : ముహూర్త లగ్నమునకు సప్తమస్థానము శుద్ధిగాయుండవలెను. వివాహ ముహూర్తమునకిది అత్యంత ప్రధానం ఒకప్పుడు బలీయ శుభ గ్రహజామిత్ర పనికి వచ్చును.

13. పాప షడ్వర్గు : లగ్న, హోర, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశాధిపతులు, శుభ గ్రహయుక్తులైగాని, శుభస్థానములందుగాని యుండవలెను. పాపస్పర్శ మహాదోషము.

14. రిష్ఫచంద్ర దోషం : వివాహ ముహూర్త లగ్నమునకు 1-6-8-12 స్థానములలో చంద్రుడున్నచో అది చెరుపు చేయును.

15. శుభతిధులు : ఉభయపక్షము లందలి 2,3,7,10 తిథులును, శుక్ల 11,12,13,15 బ. పాడ్యమి తిధులును శ్రేష్ఠములు. ఉభయపక్షములలోని 4,6 తిథులు శుక్ల 8-9 తిధులు రెండవ మతము.

16. శుభవారములు : బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠము. తప్పని సరియైనప్పుడు శని, ఆదివారములు కూడా అంగీకరింపబడుచున్నవి. మంగళవారము నిషిద్ధము దూష్యము. సోమవారము పునర్వివాహము ప్రదము. కావున సోమ, మంగళ వారములలో పెండ్లి తల పెట్టరాదు.

17. శుభతారలు : రోహిణి, మృగశిర, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి -- ఈ పదకొండు తారలూ శ్రేష్ఠమైనవి. వీటికి పాపగ్రహ సంబంధము లేకుండా చూసుకొని ముహూర్తము నిర్ణయించుకొనవలెను. జన్మ తారకు పదియవతార కర్మతార అనబడును. ఆ తారలో పెండ్లి జరపరాదు. పై నక్షత్రములలో, ఏ వైనా వధూవరులకు కర్మతారలైనచో ఆ నక్షత్రములు ఎంత గొప్పవైనను పనికిరానివని తెలియ వలెను.

18. నిషిద్ధములు : పుట్టినతిథికి 30వ తిధి నాడును, జన్మమాసమునకు ఎనిమిదవ మాసమందును, జన్మరాశికి 8వ రాశియందును, జననలగ్నరాశికి 8వ రాశియందును వివాహము చేయరాదు. సూర్యుడు మీన మందున్న చైత్ర మాసములోను, మిథున మందున్న ఆషాఢములోను, కన్యయందున్న భాద్రపదములోను, ధనుస్సు నందున్న పుష్యమాస మందును పెండ్లి చేయరాదు.

* * *

శ్రీ

# వర్ష యోగములు

చైత్రమాసము: ఇందు రవి, రాహు, కేతువులకు దహన వాయునాడీ యందును మిగిలిన గ్రహములకు రస, జల, సౌమ్య, అమృతనాడీ యందును సంచారము గలదు. ఒక అంగారక చలనము శు. ౧౫ శుక్రోదయము. బ. ౪ల బుధ శుక్ర సమాగమము. శు. ౧౧ల బ. ౭ వరకు శుక్రో వక్రీ పురోరవి గలవు. మాసమంతయు మేఘాడంబరము కల్గి బహుళమున ఖండ వృష్టి కల్గును. చాంద్రయోగముచే ఏప్రిల్ 6,7,8,12,13,14,17,18 తేదీలలో ఖండవృష్టి కల్గును.

వైశాఖమాసము: ఇందు రవి, బుధ, రాహు, కేతువులకు వాయు మహావాయు నాడీయందును మిగిలిన గ్రహములకు జల, అమృత, సౌమ్య, నాడులందును సంచారము గలదు. మాసమంతయు గాలి దుమారములు కల్గి అనావృష్టి కల్గును. చాంద్రయోగములచే ఏప్రిల్ 29,30, మే 1,6,7,13,14,17,18 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు కల్గును.

జ్యేష్ఠమాసము: ఇందు కుజ, గురు, శనులకు అమృత సౌమ్య, నాడీయందును, మిగిలిన గ్రహములకు వాయు దహననాడీయందును సంచారము గలదు. శు.౮ ల బ.౧౧ వరకు పురోబుధుడు. బ.౮ ల సింహాంగారకుడు. బ. ౭ల శని వక్రం గలదు. అనావృష్టి యోగములు హెచ్చుగా గలవు. గాలి దుమారములు గ్రీష్మాధిక్యము కల్గియుండును. చాంద్రయోగములచే మే 26,27,29, జూన్ 3,4,8,9,11,12 తేదీలలో ఆకస్మిక వర్షయోగములు కల్గును.

ఆషాఢమాసము: ఇందు శుక్ర, రాహు, కేతువులకు మహావాయు, వాయునాడులయందును మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, జల, అమృత నాడులయందును సంచారముగలదు. మాసమంతయు సింహాంగారకుడు, బ.౯ వరకు పురోబుధుడు. బ.౧౨ ల పురోంగారకుడు. అనావృష్టి ప్రదములు. మాసమంతయు మేఘాడంబరం కల్గి వుండును. చాంద్రయోగములచే జూన్ 24,25,29,30, జూలై 3,4,6,7,8,13,14 తేదీలలో వర్షములు కురియును.

శ్రావణమాసము: ఇందు రాహు, కేతువులకు తప్ప మిగిలిన గ్రహములన్నింటికీ రస, జల, అమృత, సౌమ్య నాడీ సంచారము గలదు. శు.౧౫ అంగారక చలనము. శు.౯ ల, బ.3 వరకు బుధ శుక్ర సమాగమము. శు.౧౫ వరకు సింహాంగారకుడు, శు.౮ వరకు బుధో వక్రీ పురోరవి, శు.౧౫ ల కుజ, గురు సమాగమము. శు. ౯ల ఉత్తరాకుజుడు గలవు. పూర్ణిమా ప్రాంతమున అధిక వర్షములు కురియును. చాంద్ర యోగములచే జూలై 22,23,27,28, ఆగష్టు 2,3,4,9,10,16,17 తేదీలలో వర్షములు కురియును.

అధిక భాద్రపదమాసము: ఇందు రాహు, కేతువులకు తప్ప మిగిలిన గ్రహములన్నిటికీ అమృత, రస, జల, సౌమ్య నాడీ సంచారము గలదు. శు.౫ ల షష్ఠి వరకు బుధ, శుక్ర సమాగమము. బ.౬ ల బుధ, గురు సమాగమము. బ.౬ల పురోబుధుడు. శు.౧ ల పురోగురుడు మొదలగు వర్షయోగములు. మాసమంతయు కుజ, గురు సమాగమము. పురోంగారకుడు. అమావాస్యకు పశ్చిమ దిశ మఘాది పంచక శుక్రుడు గలవు. మాస మంతయు మంచి

వర్షములు కురియును. చాంద్రయోగములచే ఆగష్టు 18,19,23,24,27,29, సెప్టెంబరు 1,2,3,5,6,8,9 తేదీలలో వర్షములు కురియును.

నిజభాద్రపదమాసము: ఇందు రవి, బుధ, శుక్ర, శనులకు అమృత, జల, రస, సౌమ్య నాడీయందును, కుజ, గురు, రాహువులకు దహన వాయు, మహావాయు నాడీయందును సంచారము గలదు. శు.౨ అంగారక చలనము. బ.౫ గుర్వస్తమయము. బ.౧౨ గురు చలనము. అమావాస్య శని చలనము. బ.౧౨ వరకు గురు, శుక్ర సమాగమము. మాసమంతయు గురు, బుధులకు ఏకరాశి స్థితి. బ.౧౧ ల పురోబుధుడు, పురోగురుడు. బ. ౧౨ల కుజ, గురు సమాగమము. మాసమంతయు పురోంగారకుడు. పశ్చిమదిశ మఘాది పంచక శుక్రుడు గలవు. శుద్ధమున అధిక వర్షములు. బహుళమున స్వల్ప వర్షములు కురియును. చాంద్రయోగములచే సెప్టెంబరు 17,19,20,26,27,28, అక్టోబరు 2,3,8,9,12 తేదీలలో వర్షములు కురియును.

ఆశ్వయుజమాసము: ఇందు శుక్ర, శనులకు అమృత రస, సౌమ్య నాడీయందును, మిగిలిన గ్రహములకు దహన, వాయు, మహావాయునాడీయందును సంచారము గలదు. బ.౧ అంగారక చలనము. శు.౧౪ శని వక్ర త్యాగము. బ.౧౦ శని చలనము. బ.౫ ల బుధ, శుక్ర సమాగమము. మాసమంతయు బుధ, గురు సమాగమము. శు.౨ ల పురోబుధుడు, పురోగురుడు. బ.౧౦ ల పశ్చిమ దిశ స్వాతీత్రయ శుక్రుడున్ను, బ.౭ ల బుధో వక్ర పురోరవి బ.౧ వరకు కుజ గురు సమాగమము. శు.౨ వరకు పురోంగారకుడు. బ.౧౦ వరకు పశ్చిమదిశ మాఘాది పంచక శుక్రుడు గలవు. బహుళమున అధిక వర్షములు కురియును. శుద్ధ విదియ ప్రాంతమున పశ్చిమ ప్రాంతములందు గాలితో కూడిన వర్షములు కురియును. చాంద్రయోగములచే అక్టోబరు 16,17,23,24,30,31, నవంబరు 6,7,12,13 తేదీలలో గాలితో కూడిన వర్షములు కురియును.

కార్తీకమాసము: ఇందు శనికి అమృత నాడియందును మిగిలిన గ్రహములకు మహావాయు, వాయునాడీ సంచారము గలదు. బ.౧౩ అంగారక చలనము. శు.౧౩ వరకు బుధ, శుక్రులకు ఏకరాశి స్థితి. బ.౩ వరకు గురు, బుధ సమాగమము. బ.౩ల బుధ, శుక్ర సమాగమము. బ.౧౪ ల గురు, శుక్ర సమాగమము. బ.౧౩వ పశ్చిమ దిశ స్వాతీత్రయ శుక్రుడు గలవు. శు.౨ వరకు బుధో వక్రీ, పురోరవి, శు.౩ ల బ.౧౩ వరకు రవి, కుజ సమాగమము. బ.౧౩ ల రవి, కుజ సమాగమము. బ.౧౩ ల పురోంగారకుడు. శు.౧౦ ల బ.౧౩ వరకు జ్యేష్ఠా కుజుడు గలవు. శుద్ధమున గాలితో కూడిన వర్షములు, బహుళమున అనావృష్టి కల్గును. తూర్పు, ఈశాన్య ప్రాంతములందు గాలితో కూడిన వర్షములు కల్గి తుఫాను సూచనలు కల్గును. చాంద్ర యోగములచే నవంబరు 15,16,22,23,24,28,29, డిశెంబరు 3,4,5,10,11, తేదీలలో వర్ష సూచనలు కల్గును.

మార్గశిరమాసము: ఇందు శన్యేతర గ్రహములన్నిటికినీ వాయు, దహన, సౌమ్య నాడీ సంచారము గలదు. మాసమంతయు బుధ, శుక్ర సమాగమము. శు.౩ ల బుధ, కుజ సమాగమము. శు.౩ వ పురోంగారకుడు గలదు. మాసమంతయు మేఘాడంబరము కలిగి ఆకస్మిక వర్ష సూచనలు

కల్గును. చాంద్రయోగములచే డిశెంబరు 14,15,18,19,23,24,29,30, జనవరి 2,3,6,7 తేదీలలో ఆకస్మిక వర్షసూచనలు కల్గును.

పుష్యమాసము: ఇందు గురు, రాహువులకు వాయు, మహావాయు నాడులందును, మిగిలిన గ్రహములకు రస, జల, అమృత నాడులందును సంచారము గలదు. శు.౮ అంగారక చలనము. బ.౧ వరకు బుధ, శుక్ర సమాగమము. బ.౧ ల రవి, కుజ సమాగమము. శు.3 ల పురశ్శని. శు.౪ ల బ.౫ వరకు ఉత్తరాషాఢ కుజుడు గలవు. మాసమంతయు మేఘాడంబరము కలిగి ఖండ వృష్టి కల్గును. చాంద్రయోగములచే జనవరి 15,16,19,20,22,23,27,28,31, ఫిబ్రవరి 1,9,10 తేదీలలో ఖండవృష్టి కల్గును.

మాఘమాసము: ఇందు రవి, కుజ, బుధ, శుక్ర, శనులకు అమృతయోగ, సౌమ్య నాడియందును, గురు, రాహుకేతువులకు మహావాయు నాడీ సంచారము గలదు. బ.౧ అంగారక చలనం. బ.౧౧ శుక్రోదయము. బ.3 ల బ.3 వరకు బుధో వక్ర బుజశ్శుక్రుడు. శు.౨ వరకు పురోబుధుడు. బ.౬ ల పురుశ్శుక్రుడున్నూ, శు.౧ ల బ.౭ వరకు బుధో వక్రీ పురోరవి, బ.౨ ల కుజ, రవి, శని సమాగమము గలవు. శుద్ధమున ఖండవృష్టి, బహుళమున అనావృష్టి కల్గును. చాంద్రయోగములచే ఫిబ్రవరి 12,13,18,19,26,27, మార్చి 2,3,11,12 తేదీలలో ఖండవృష్టి కల్గును.

ఫాల్గుణమాసము: ఇందు గురు, శుక్ర, రాహువులకు మహావాయు నాడియందును, రవి, కుజ, బుధ, శనులకు రస, సౌమ్య, జల, అమృత నాడులయందును సంచారము గలదు. బ.౧౧ అంగారక చలనము. శు.౨ వరకు పురశ్శుక్రుడు. శు.౧౫ ల పునపురశ్శుక్రుడు. శు.౨ వరకు కుజ, రవి సమాగమము. బ. ౧౧ల కుజ, రవి సమాగమము గలవు. మాసమంతయు మేఘప్రాబల్యము కల్గి బహుళమున ఆకస్మిక వర్ష సూచనలు కల్గును. చాంద్రయోగములచే మార్చి 13,14,22,23,27,28,30,31, ఏప్రిల్ 1,8,9 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు కల్గును.

## అర్ఘ యోగములు

చైత్రమాసము: ఈ మాసము నువ్వులు, యవలు, సర్వ ధాన్యములు మొ॥ వాని ధర హెచ్చును. బహుళ సప్తమి వరకు నెయ్యి, నూనెను, వక్కలు, ప్రత్తి, పసుపు మొ॥ వాని ధర హెచ్చుగా వుండును. టేకు, మద్ది మొ॥ కలప వస్తువులకు విశేష ధరలుండును. చక్కెర, బెల్లము, సుగంధ ద్రవ్యములు మొ॥ వాని ధరలు సమముగ వుండును. పేపరు, రసాయనములు, గృహోపకరణ వస్తువులు మొ॥ వాటి ధరలు హెచ్చుగా వుండును. అపరములు, నూనె, నెయ్యి ధరలు విశేషముగా వుండును. వస్త్రముల ధరనిలబాటు.

వైశాఖమాసము: బహుళత్రయోదశి లగాయితు ధాన్యమునకు ధర పెరుగును. శుద్ధ పాడ్యమి మొదలు నవమి వరకు కుంకుమ, పసుపులకు ధర హెచ్చును. శుద్ధ నవమిలగాయితు బహుళ

పాడ్యమి వరకు గోధుమ, యవలు, చెఱకు, పాలు, రసద్రవ్యములు, నెయ్యి మొదలగువానికి ధర హెచ్చును. బహుళ పాడ్యమి మొదలు సప్తమి వరకు ధర హెచ్చును. బహుళ చతుర్దశి లగాయితు ప్రత్తి, నువ్వులు ధర హెచ్చును. శుద్ధ పంచమి వరకు వడ్లు సర్వధాన్యములు, వస్త్రములు ధర పెరుగును. శుద్ధ పంచమి మొదలు బహుళ షష్ఠి వరకు పొట్టు ధాన్యములు, వక్కలు, యాలకులు, జీడిఫలములు, గోవులు, టెంకాయలు, మిరియాలు, ఔషధులు మొదలగువానికి ధర పెరుగును. బహుళ షష్ఠి మొదలు పెనగలు, ధాతు పదార్థములు, లోహముల ధర పెరుగును. శుద్ధ పాడ్యమిలగాయితు ద్వాదశి వరకు బంగారము, వెండి, నూనెల ధర పెరుగును.

జ్యేష్ఠమాసము: బహుళ అష్టమి మొదలు ధాన్యాదులకు ధర పెరుగును. అష్టమి మొదలు నువ్వులు, మినుములు, కూరగాయలు మొదలగు వానికి ధర పెరుగును. ప్రత్తి, నూలులకు ధరలు హెచ్చును. బహుళ చవితి మొదలు బ. చవితి వరకు సర్వధాతువులకు రస వస్తువులు, కంబళ్ళకు ధర పెరుగును. బ. ఏకాదశి మొదలు సజ్జ, జొన్నలు, కాఫీ విత్తనములు, తేయాకు, వెల్లుల్లి మొదలగు వాని ధర హెచ్చు. పెసలు, కుంకుళ్లు ధర హెచ్చును. చింతపండు ధర మందము. ఎండు మిర్చి ధర విశేషం.

ఆషాఢమాసము: బహుళ విదియ మొదలు నువ్వులు, పెసలు, మొదలగువాని ధర పెరుగును. విదియలగాయితు నూనెలకు ధర హెచ్చును. శుద్ధ సప్తమి మొదలు శుద్ధ తదియ వరకు ఉప్పు, రసద్రవ్యములు, కస్తూరికి ధర పెరుగును. బ. విదియ మొదలు ఆకులు, బెల్లము, కంద, ముత్యములు, వెల్లుల్లి, పసుపు, పొగాకు ధర పెరుగును. కొబ్బరి ధర నిలబాటు.

శ్రావణమాసము: శుద్ధ నవమి వరకు అవిసెలు, వులవలు ధర పెరుగును. నవమి లగాయితు నెల ఆఖరు వరకు పశువులు రేటు హెచ్చును. కలప గృహాలంకరణల ధర విశేషం. ఈ మాసములో బంగారము, వెండి, రాగి మొదలగు లోహముల ధర పెరుగును. బ. పాడ్యమి లగాయితు చిఱుసెనగలు, మిరియాలు ధర పెరుగును. శు. నవమి లగాయితు, వస్త్రములు, గడియారములు, రంగులు, లవణములు ధర హెచ్చును.

అధిక భాద్రపదమాసము: ఈ మాసములో కూరగాయల ధర తగ్గును. శుద్ధ షష్ఠి వరకు పొట్టు ధాన్యములకు ధర హెచ్చును. బ. చవితి లగాయితు ద్వాదశి వరకు పెసలు ధరలు సమము. శు. పాడ్యమి మొదలు టేకు, కలపలకు ధర విశేషం. రత్నములు, పగడము, బెల్లం, కొబ్బరికాయలు మొదలగు వాని ధర పెరుగును. మొక్కజొన్న ధర కొద్దిగా పెరుగును.

నిజభాద్రపదమాసము: ఈ మాసమంతయు ధాన్యము గోధమ ధర నిలకడగా వుండును. శ్రీచంద నము, కస్తూరి, దేవదారు, అగరు, రక్త చందనముల ధర పెరుగును. రస ద్రవ్యములైన మిరియాలు, యాలకులు, ఇంగువ మొదలగు వాని ధర హెచ్చును. బ ౧౨ లగాయితు కొబ్బరినూనె, నెయ్యిలకు ధర పెరుగును. రసాయనిక ద్రవ్యములు, పెట్రోలు, డీసెల్ మొదలగు ఇంధనముల ధర పెరుగును. బెల్లం, వేరుశెనగ, సెనగలు, చింతపండు మొదలగు వాని ధర పెరుగును.

ఆశ్వయుజమాసము: ఈ మాసాంతమందు నూనె ధరలు, అపరములు, సుగంధ ద్రవ్యముల ధరలు హెచ్చుబాటు. శుద్ధ నవమి మొదలు వక్కలు, ఆవాలు, ఖర్జూరము, ఆహారపదార్థములు ధర కొంచము పెరుగును. దీపావళి సామగ్రి ముఖ్యముగా ప్రేలుడు పదార్థముల ధర హెచ్చుగానే వుండును. పాలు ధర కూడా హెచ్చుగా వుండును. శ్రావణ భాద్రపదము కంటే బంగారం రేటు తక్కువగానే వుండును.

కార్తీకమాసము: శుద్ధ దశమి వరకు పశుసంపద రేటు హెచ్చును. బ. త్రయోదశి మొదలు పొట్టు ధాన్యముల ధర హెచ్చును. గుగ్గిలం, లక్క, కర్పూరము, పాదరసము, ఇంగువ, కంచు సామగ్రి ధరలు హెచ్చును. సిమెంటు, స్టీలులకు సమముగా వుండును. శుద్ధ తదియ మొదలు చక్కెర, పాలు ధరలు పెరుగును. నువ్వులు, పసుపు ధర నిలబాటు.

మార్గశిరమాసము: శుద్ధ౧ ల ౯ వరకు చెఱకు, బెల్లము, వరి, నెయ్యిల ధర పెరుగును. శు.౩ల తెల్లని వస్తువులు, రసవస్తువులు, తెల్లధాన్యములు, ప్రత్తి, ఉప్పు ధరలు పెరుగును. రసాయనిక ద్రవ్యములు, పేపరు మొదలు ఉత్పత్తుల ధరలు సమముగ వుండును. యాలకులు, కొబ్బరి, పొట్టు ధాన్యములు మొదలగువాని ధర మధ్యమముగ వుండును. నెయ్యి, నూనె, సుగంధ ద్రవ్యములు, చందనము మొదలగు వాని ధరలు పెరుగును. తోలు వస్తువులు గిరాకీగా వుండును.

పుష్యమాసము: ఈ మాసమందు ద్రాక్షపండ్లు, ఏపిల్ ఫలములు, కర్జూరము మొదలగు వాని ధర విశేషముగా వుండును. ముత్యములు, అలంకరణ వస్తువుల ధర నిలబాటుగా వుండును. వస్త్రముల రేటు హెచ్చును. బ.౧౧ ల బంగారము, వెండి, మిశ్రమ ధాతువులు, అలంకరణ వస్తువుల ధరలు సమముగా వుండును. కలప, వెదురు, కర్పూరము, సుగంధ ద్రవ్యముల ధర హెచ్చును. ఈ మాసమందు కాయగూరలు, ఆకుకూరలు విరివిగా లభించును.

మాఘమాసము: శు.౮ ల బ.౧౦ వరకు ధాన్యము, బెల్లము, చక్కెర, నూనె గింజలు మొదలగు వాని రేటు హెచ్చును. బంగారము, వెండి, ధాతు వస్తువులు, మణులు, ముత్యములు, ఇనుము, సిమెంటు, గృహోపకరణ వస్తువులు మొదలగు వాని ధరలు హెచ్చును. రసాయన సామగ్రి, పేపరు, ప్రత్తి, తైలము మొదలగునవి మధ్యమము.

ఫాల్గుణమాసము: శు.౧౨ ల వాణిజ్య పంటలు అయిన ప్రత్తి, పుగాకు, నూనెగింజలు, వేరుశెనగ మొదలగు వాని రేట్లు విశేషముగా హెచ్చును. ఇనుము, సిమెంటు, ఇటుకలు, రసాయనిక ద్రవ్యములు, ఔషధులు, ఎలక్ట్రానిక్ వస్తువులు మొదలగు వాని ధరలు హెచ్చును. చేపలు, గ్రుడ్లు మొదలగు వాని రేట్లు హెచ్చును. మొత్తము మీద ఈ సంవత్సరమంతయు ధరలు విశేషముగా వుండును.

* * *

# మేషరాశి

## (అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆదాయం: 5 వ్యయం: 5 రాజపూజ్యం: 3 అవమానం: 1

ఈ రాశివార్కి అక్టోబరు 12 వరకు గురుడు 6ట సువర్ణ మూర్తి. తదాది వత్సరాంతం వరకు 7 ట రజిత మూర్తి. వత్సరమంతయు రాహువు 8ట కేతువు 2ట రజితమూర్తులు. శని అక్టోబరు 15 వరకు 11ట లోహమూర్తి. తరువాత నవంబరు 9 వరకు 10ట (వక్రించి) తామ్రమూర్తి. తదాది వత్సరాంతం వరకు 11ట సువర్ణ మూర్తి.

ఈ రాశివార్కి గురుడు సంవత్సర పూర్వార్థం వరకు శత్రు క్షేత్రమందున్ననూ మూర్తిమంతం రీత్యా $\frac{3}{4}$ వంతులు యోగప్రదుడు. శని యోగించును. రాహు కేతువులు మధ్యమము. ఈ రాశివార్కి పట్టుదల అధికము. తలచిన కార్యములు నెరవేరే వరకు నిద్రించరు. తరచు ధన లాభ వ్యయములు కలుగును. గత సంవత్సరం కంటె ఒడుదుడుకులు తగ్గును. సంవత్సర పూర్వార్థమున ఆరోగ్యాది లోపములు, కార్య విఘ్నములు, మనో అశాంతి, నేత్రములు మోకాళ్లు కటి ప్రదేశములందనారోగ్యములు మున్నగు సూచనలు కలుగును. సమస్యలను సామరస్యముగా పరిష్కరించుకొనగలుగుదురు. దగ్గర బంధు వ్యయము రీత్యా అశాంతి. నల్లని జంతుభీతి మాతృవర్గము ఆరోగ్యలోపములు. ప్రతీ పనియందు అనుమానములు, శోషణములు కలుగుచుండును. ఉదార బుద్ధిగా ఉందురుగాని శూన్యము. 6,7 నెలలందు కళత్ర, పుత్ర ఆరోగ్యవృద్ధి. పరస్త్రీవాంఛ. మనస్తాపము కలుగును. అక్టోబరు సమీపములందు శస్త్రబాధ అపవాదములు మిత్ర శత్రుత్వములు కలుగుచుండును. విద్యార్థులకు గణితము, తెలుగులందు అధిక శ్రద్ధ వహించవలెను. ఉన్నత విద్యాయోగములు గలవు. సైన్సు, ఇంజనీరింగు సాంకేతిక విద్యల వారికి సామాన్యము. ఉద్యోగస్థులకు గతము కంటె చాల మేలు. యాంత్రిక స్వతంత్ర వ్యాపారవృత్తులవారికి అధికార ఒత్తిడులు ఎదుర్కొన వలసి వచ్చినను చివరకు మేలు జరుగును. వ్యవసాయదార్లకు మంచి కాలము. యత్న కార్యసిద్ధి, గృహ నిర్మాణాదులు సంవత్సర పూర్వార్థము మేలు. వివాహాది శుభ యత్నములు సంవత్సర ఉత్తరార్థం అనుకూలించును.

అశ్వినివారు వైఢూర్యము, జాతి పచ్చ ధరించుట మేలు. భరణివారు వజ్రము, నీలమణి ధరించిన అత్యధిక శుభములు పొందగలరు. కృత్తిక వారు కెంపు, పుష్యరాగములు ధరించుట వలన ఉద్యోగ సంప్రాప్తములు, సంతాన సౌఖ్యములు కల్గును.

1,2,4,6,9 తేదీలు, సంఖ్యలు ఆది, సోమ, శుక్రవారములు మరింత యోగములు. శ్రీ విష్ణు, దత్తాత్రేయ ఆరాధనలు ఉత్తమములు. స్త్రీలు శుక్రవార నియమములు, లలిత, విష్ణు పూజలు చేయుట వలన మనోభీష్టము నెరవేరును. వీర్కి అదృష్ట సంఖ్య 9.

## వృషభరాశి

(కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగ 1,2 పా.)

ఆదాయం: 14 వ్యయం: 11 రాజపూజ్యం: 6 అవమానం: 1

ఈ రాశివార్కి అక్టోబరు 12 వరకు 5ట గురుడు తామ్రమూర్తి. తదాది వత్సరాంతం వరకు 6ట లోహమూర్తి. రాహువు 7ట కేతువు జన్మమందు తామ్రమూర్తులు. శని అక్టోబరు 15 వరకు 10 ట తామ్రమూర్తి. తర్వాత నవంబరు 9 వరకు (వక్రించి) సువర్ణమూర్తి. తదాది వత్సరాంతం వరకు 10ట రజితమూర్తి. వీర్కి అక్టోబరు వరకు గురుడు పూర్ణ యోగ ప్రదుడు. శని యోగకారి అగుట వలన అక్టోబరు నందు తలచిన దానికి బదులు వేరొక విశేషము చూపును. రాహు కేతువులు వత్సరమంతయు ప్రతి బంధకులు.

ఈ రాశివారు శాంత ప్రియులు. మిత భాషులు. ఇతరులకు అపకారము చేయని వారు, చేసిన మేలు మరువని వారును, అలంకార, వాహన భోగలాలస ప్రియులు తలచిన కార్యములు మందముగా, ఆతృతగా చేయుచుందురు. ఉద్యోగ వ్యాపార పదములందు విరమణలు మార్పు చేర్పులు చేయుదురు. కళత్ర పుత్ర సహకారముతో కుటుంబ సమస్యలు పరిష్కృతములు అగుచుండును. వీర్కి తరచు నరముల నిస్సత్తువ, అరికాలి దురదలు, పాపకార్యాసక్తతలు, కళా నైపుణ్యములు, తరచు ప్రయాణములు కల్గుచుండును.

స్త్రీలయందు భోగలాలసత్వములు, త్రిప్పట, స్థానచలనములు, కృశించిన శరీరము కల్గుట అధిక మనస్తాపము కల్గును. విద్యార్థులకు ఉన్నత ఆశయములు నెరవేరుటకై, విద్యాసక్తి కల్గుటకై సరస్వతీ, సుబ్రహ్మణ్య, నవగ్రహధ్యానము చేయుట మంచిది.

ఇంజనీరింగు, స్వతంత్ర వృత్తులవారికి యోగ కాలము. లెక్చరర్లు, సైన్సు వృత్తులు, రసాయన వ్యాపారులకు బహు సామాన్య కాలము. అన్ని రంగముల వ్యాపారులు నిదానించి పెట్టుబడులు తగ్గించి వ్యాపారము చేయుట మేలు. జాయింటులు అనుకూలము కాదు. వ్యవసాయ దార్లకు పెట్టుబడులు మిగులును. ఇనుము, తైలము, ధాన్యము, కోళ్ళు పరిశ్రమ మత్స్యకళాకారులుకు విశేష ఫలములు కల్గును.

కృత్తిక వారు కెంపు, పుష్యరాగము ధరించుట, ఆదివార నియమములుండుట, సూర్యారాధనలు చేయుట మంచిది. రోహిణి వారు ముత్యము, పగడము ధరించుట, శ్రీ విష్ణు, కార్తవీర్యార్జున ఆరాధనలు చేయుట ఉత్తమము. మృగశిర వారు పగడము, పచ్చ ధరించిన మేలగును.

ఈ రాశి వార్కి అదృష్ట సంఖ్య 6. వీరు శనివార నియమము చేయుట, శని రాహు కేతువుల జపములు చేయించుకొనుట వలన కుటుంబమందు శాంతి సౌభాగ్యములు కల్గును.

3,5,8 సంఖ్యలు బుధ, శని, మంగళ వారములు కలిసిన మరింత యోగప్రదములు.

## మిధునరాశి

(మృగ 3,4 ఆర్ద్రి, పునర్వసు 1,2,3 పా.)

ఆదాయం: 2 వ్యయం: 11 రాజపూజ్యం: 2 అవమానం: 4

ఈ రాశివార్కి రాహువు 5ట, కేతువు 12ట తామ్రమమూర్తులు. గురుడు అక్టోబరు 12 వరకు 4ట తామ్రమమూర్తి. తదాది 5ట సువర్ణమూర్తి. శని అక్టోబరు 15 వరకు 9ట రజితమూర్తి. అటునుండి నవంబరు 9 వరకు (వక్రించి) అష్టమ మందు రజితమూర్తి. తదాది 9ట లోహమూర్తి. సంవత్సర ఉత్తరార్థమునందు గురుడు పూర్ణ శుభుడు. రాహు కేతువుల వలన కొన్ని సమస్యలు పరిష్కార మగును. వీరు ప్రతి పనియందు నిదానించి ముందడుగు వేయుచుందురు. బంధుమిత్ర సఖ్యత దైవ క్షేత్ర సందర్శనములు చేయుచుందురు.

సంవత్సర ప్రారంభ చివరలందు కంఠము, నడుము సంబంధ అనారోగ్య సూచనలు కలవు. చిరకాలమునుండి నిలచిన వ్యవహారములు పరిష్కారమగును. ఉన్నత వ్యక్తులతో స్నేహము నొందుదురు. నూతన ఉద్యోగములు, ప్రమోషన్లు కల్గును. శుభ కార్యములు అయత్నములుగా నెరవేరును. భూగృహ నిర్మాణాదులందు చాలా నిదానమవసరము.

విద్యార్థులకు ఉన్నతస్థాయి, ఉత్తీర్ణతలు, ప్రశంసలు లభించును. అధికార్లకు యత్న బదిలీలు అనుకూలించును. వ్యవసాయ దార్లకు, కంట్రాక్టర్లకు మంచికాలము. స్వతంత్ర వృత్తులు, వ్యాపారులకు ఉత్తరార్థము మేలు. మృగశిర వారు పగడము ధరించుట, గణేశ్వర లక్ష్మి ఆరాధనలు చేయుట ఉత్తమము. ఆరుద్రవారు పరమేశ్వర, పార్వతీ ఆరాధనలు, నామ పఠనములు, గోమేధిక ధారణ వలన మనోల్లాసము కల్గును.

పునర్వసు వారు రాఘవేంద్ర, సాయినాథ ఆరాధనలు, ఆలయ ప్రదక్షిణలు చేయుట పుష్య రాగము ధరించుట వలన యత్న కార్యసిద్ధి కలిగి కష్టములు తొలగును.

మొత్తము మీద ఈ రాశివార్కి అంగారక, మందేశ్వర, కేతు గ్రహారాధనలు రుద్రాభిషేకములు చేయుటవలన సంవత్సరమధ్య యందు కలుగు వక్రశని వలన అత్యున్నత స్థిరములు, సుఖములు కలుగును. అంతియకాక అపమృత్యు దోష పరిహారమగును.

అదృష్ట సంఖ్య 5. 1,6,3 సంఖ్యలు ఆదిత్య శుక్ర అంగారక వారములు కలసిన మరింత యోగప్రదములు. స్త్రీలు లక్ష్మి, విష్ణు నామ పారాయణలు, సోమవార నియమములు చేయుట వలన కుటుంబమందు ఆరోగ్య లాభములు కల్గుచు, ఆలస్యమైననూ కళ్యాణాది శుభములు కల్గును.

## కర్కాటకరాశి

(పునర్వసు 4వ పాదము, పుష్యమి, ఆశ్రేష)

ఆదాయం: 11 వ్యయం: 8 రాజపూజ్యం: 5 అవమానం: 4

ఈ రాశివార్కి సంవత్సరమంతయు శని 8ట రజిత మూర్తి. రాహువు 5ట, కేతువు 11ట సువర్ణమూర్తులు. అక్టోబరు 12 వరకు గురుడు 3ట సువర్ణమూర్తి. తదాది వత్సరాంతము వరకు 4ట రజితమూర్తి.

వీర్కి ఈ సంవత్సరము గతము కంటే మేలు. గురుడు మధ్యమ ఫలితములనిచ్చును. అష్టమ శని కష్ట, శ్రమ ప్రదుడయిననూ మూర్తిమంతము రీత్యా యోగకారకుడు అగుట వలన, రాహు కేతువుల బలము వలన స్థిర భూగృహ నిర్మాణాదులు, ఉద్యోగ వివాహాది శుభములు ఆలస్యముగ అయిననూ తప్పని సరిగ నెరవేర్చును. యాంత్రిక సంస్థల వార్కి మెలకువలు అవసరము. ఆరోగ్య మార్పులు, దైవకార్యాచరణలు కలసి వచ్చును. నూతన రాజకీయ దారులకు మంచి అవకాశములు. తరచు మోకాలి నొప్పులు, సంఘమునందు వ్యతిరేకతలు, ప్రయాసతో ధన లాభములు కల్గుచుండును. ఇతరులను నమ్మరాదు. స్వయంకృషి ద్వారా యత్నసిద్ధి శాంతి కల్గును. సంవత్సర పూర్వార్థమునందు మాట తొందరలు, సంతుష్టి, మంచివారి వలన ఆదాయము కల్గును. జూన్, జూలైలందు ఆరోగ్యమార్పు సూచనలు గలవు.

విద్యార్థులకు ఫలితములు సామాన్యములు. సరస్వతీ, గురు, శని స్తోత్రజపములు చేయించు కొనుట ద్వారా వృద్ధి కల్గును. సైన్సు, ఆంగ్ల విద్యార్థులకు కొంత మేలు. ఉద్యోగస్థులకు కొంచెము ఇబ్బంది కరమైన కాలము. స్వతంత్ర వృత్తివారలకు వ్యాపారస్తులకు అతి సామాన్య ఫలితములు కల్గును. కాంట్రాక్టులు అనుకూలములు గావు.

పునర్వసు వారు పుష్యరాగము ధరించుట మేలు. పుష్యమి వారు నీలమణి ధరించుట మంచిది. ఆశ్రేష వార్కి పచ్చ, పుష్యరాగము ధరించుట వలన యత్న ఫలితములు సిద్ధించును.

ఈ రాశివార్కి అదృష్టసంఖ్య 2.

ఈ రాశివార్కి 3,8,12, జనవరి, ఫిబ్రవరి మాసములు కాక ఇతరమాసములు, మానసిక శాంతి, ప్రయత్న ఫలిత సిద్ధి కల్గును. ముఖ్యముగ శనివార నియమములు. శ్రీ సూర్య ఆరాధనలు, శివ సహస్రనామ పారాయణలు. మహా మృత్యుంజయ జపశాంతులు శని చంద్ర గ్రహ జపశాంతులు చేయించుకొనుట ద్వారా గ్రహదోషము తొలగును. శివలింగ దర్శనము వలన శనిశాంతించి ఉపకరించును. అపమృత్యు దోషము తొలగును.

స్త్రీలు శనివారములు, శివ పార్వతుల నామ పఠన, ఆంజనేయ ఆరాధనలు చేయుట ద్వారా కుటుంబ వృద్ధి, ధన లాభము ఆరోగ్యములు కల్గును.

## సింహరాశి

### (మఘ, పూర్వఫల్గునీ, ఉత్తర ఫల్గునీ 1వ పాదం)

ఆదాయం: 14 వ్యయం: 2 రాజపూజ్యం: 1 అవమానం: 7

ఈ రాశి వార్కి అక్టోబరు 12 వరకు గురుడు 2ట తామ్రమూర్తి. శని వత్సర మంతయు 8ట లోహమూర్తి. రాహువు 5ట, కేతువు 11ట వత్సర మంతయు తామ్రమూర్తులు.

అక్టోబరు వరకు గురుడు వీర్కి విశేష ఫలితములిచ్చును. తరువాత తృతీయమందు శ్రమ, వత్తిడి అధిక భారములను ఇచ్చును. శని సామాన్య ఫలితములనిచ్చును. రాహు కేతువులు మధ్యమ ఫలితములిచ్చును.

ఏది ఏమైననూ వీర్కి దీక్ష, పట్టుదల, శ్రమకు మించిన పనులు చేయుట, హుందాతనము కల్గివుందురు. సంవత్సర పూర్వార్థమునందు కవితా వ్యాసంగములు, నోటి పూత, కీళ్ళ నొప్పులు, గొప్పవారితో స్నేహములు తరచు ప్రయాణములు చేయు వృత్తియందు, స్థానమునందు ప్రశాంతత లోపించుట మరియు సంవత్సర ఉత్తరార్థమునందు దైవ బ్రాహ్మణ భక్తి, కార్యాచరణలు, నూతన భూ,గృహముల గురించి చింతన, శుభాదులు ఆలస్యముగా కల్గుచు తొందరపడుచుండుట. బంధువులకు దూరముగ నుండుట, మున్నగు లక్షణములు కల్గివుందురు.

విద్యార్థులకు విద్యా ప్రతిబంధకములుండును. అత్యధిక శ్రద్ధ చూపినగాని ఉత్తీర్ణులు కాలేరు. కంట్రాక్టర్లకు సామాన్య ఫలితములు. అన్ని రంగములుద్యోగులకు వత్తిడులు హెచ్చుగ వుండును. అధిక శ్రమ, వ్యయ, ప్రయాసలు కల్గుచుండును. వ్యాపారులందు ఆకస్మిక దాడులు, ప్రాకృతిక వైఫల్యముల నెదుర్కొన వలసి వచ్చును. అయిననూ వ్యవసాయదారులకు విశేష కాలము. వ్యాపారస్తులకు ఫలితములు ఉత్సాహవంతములు.

స్వతంత్ర వృత్తి వారలకు విశేష కాలము.

మొత్తము మీద ఈ రాశి వారలకు అన్ని గ్రహముల బలము సామాన్యముగ నుండుట వలన నవరత్న ధారణలు, నవగ్రహములు, మహా మృత్యుంజయ జపశాంతులు చేయించు కొనవలెను. ఈశ్వర ఆరాధన, అభిషేకాదులు చేయించు కొనుట ద్వారా విశేష ఫలితములనొందెదరు.

## కన్యారాశి

(ఉత్తర 2,3;4 పాదములు, హస్త, చిత్త 1,2 పాదములు)

ఆదాయం: 2 వ్యయం: 11 రాజపూజ్యం: 4 అవమానం: 7

ఈ రాశివారికి గురుడు అక్టోబరు 12 వరకు జన్మమందు, సువర్ణ మూర్తి. తదాది వత్సరాంతం వరకు లోహమూర్తి. రాహువు 3ట, కేతువు 9 సంవత్సరమంతయు లోహమూర్తులు. శని అక్టోబరు 15 వరకు 6ట సువర్ణమూర్తి. తరువాత వక్రముచే 5ట నవంబరు 9 వరకు రజిత మూర్తి. తరువాత వత్సరాంతం 6ట సువర్ణమూర్తి.

అక్టోబరు వరకు గురుడు సామాన్య ఫలితములనిచ్చును. తరువాత ద్వితీయ స్థానమందు యోగప్రదుడు. శని సంవత్సర ప్రారంభము చివరలందు యోగ ప్రదుడు. రాహు కేతువులు సామాన్య ఫలితములనిచ్చును.

ఈ రాశివారు వ్యాపార తత్వముగ మాట్లాడుచుందురు. ప్రతి పనియందు బహు నిదానముతో ఆచరించుదురు. అలంకార, సన్మానాదులు గురించి ఆరాటము, సుఖ భోగము, ప్రతి పని చేయుట యందు అతి తొందర, ధన వ్యయము చేయుట, కుటుంబమందు కళ్యాణములు, శుభములు నెరవేర్చువారు అగుదురు. దైవ బంధుమిత్ర సందర్శనముల నిమిత్తము ఎక్కువగ ప్రయాణములు చేయుచుందురు. సంవత్సర ఉత్తరార్థమందు సన్మిత్ర లాభములు, ఆర్థిక లాభము, మనోల్లాసములు కల్గియుందురు. అప్పుడప్పుడు నరముల నిస్సత్తువ కల్గివుందురు. వీర్కి గత సంవత్సరం కంటె చాల మేలుగలదు. భూక్షేత్రముల అభివృద్ధి పరచుకొందురు. సంవత్సర మధ్యయందు కుటుంబమందు శాంతి లోపించు సూచనలున్ననూ వెంటనే శాంతి కలుగు.

విద్యార్థులకు ఆంగ్లము, గణితము లందధిక శ్రద్ధ కల్గివుండవలెను. ఉద్యోగస్తులకు, అధికారులకు న్యాయవాద వృత్తివారలకు సంవత్సరము ఉత్తరార్థము యోగించును. తైల, యాంత్రిక, రసాయనిక వస్త్ర వ్యాపారులకు 6,9,10,1,2 నెలలుకాక మిగిలిన నెలలందు ఆశించిన ఫలితములు నెరవేరును. ఇంకనూ వ్యాపార వృద్ధి కల్గును. వ్యవసాయదారులకు సంవత్సరం రెండవ పంట బాగుగా ఫలించును.

ఉత్తర వారు కెంపు ధరించుట, సూర్యారాధనలు చేయుట, హస్త వారు శ్రీకృష్ణ, విష్ణు పూజలు చేయుట, శ్రీ రాజరాజేశ్వరీ పూజలు చేయుట, చిత్రవారు పగడము, ముత్యము ధరించిన యోగ ప్రదముగ వుండును.

మొత్తము మీద ఈ రాశివార్కి 6,7,8,11,12,2 మాసములందు యత్న ప్రయత్నములు సిద్ధించును. గృహమందు కళ్యాణాదులు కలసి వచ్చును. 1,2,5,8 తేదీలు. ఆదిత్య బుధ శనివారములు మరింత యోగప్రదములు. గురు గ్రహ జపము, గురువార నియమములు యోగప్రదములు.

స్త్రీలు, గణేశ, మాతంగి, శ్రీలక్ష్మీ రమణుల నారాధించిన కుటుంబమందు ఆరోగ్య ధనలాభములు కల్గును.

## తులారాశి

(చిత్త 3,4 పాదములు, స్వాతి, విశాఖ 1,2,3 పాదములు)

ఆదాయం: 14 వ్యయం: 11 రాజపూజ్యం: 7 అవమానం: 7

ఈ రాశివార్కి గురుడు 12ట అక్టోబరు 12 వరకు రజితమూర్తి. తదాది వత్సరమంతయు సువర్ణమూర్తి. రాహువు 2ట, కేతువు 8ట, సంవత్సరమంతయు సువర్ణ మూర్తులు. శని అక్టోబరు 15 వరకు 5ట తామ్రమూర్తి. తరువాత వక్రముచేత 4ట సువర్ణమూర్తి. తరువాత సంవత్సరాంతము వరకు 5ట లోహమూర్తి.

గురుడు ఈ రాశివార్కి నైసర్గిక శుభుడు. మూర్తి మంతం రీత్యా యోగప్రదుడు. శని సంపూర్ణ యోగ ప్రదుడు. స్థాన బలమును, ఆరోగ్యమును చేకూర్చును. ఉద్యోగస్తులందు అందరియందు నవంబరు ప్రాంతములందు మనోభేదములు, స్థానమార్పులు కలుగ చేయుచున్ననూ యోగకారి: ఈ రాశివార్కి తరచు మాస పట్టింపులు ప్రయాణములందాసక్తి, చర్మ రోగములు, మాతృవర్గ రీత్యా అనారోగ్యములు, మంచియే చెడుగా వర్తించుట, జంతు భయము, ఉన్నతాధికార మిత్రలాభము మొదలగు లక్షణములుండును. పాండిత్య, కవిత్వ, మంత్ర దృష్టి హెచ్చుగ వుండును. కళానైపుణ్యములు చూపుచుందురు. సంవత్సర పూర్వార్థమునందు భూగృహ శుభ కార్యాదులు కలసివచ్చును. నాస్తికత, శతృచోర నిర్భయత కల్గివుందురు. కలలు, కాలి దురదలు తరచుగ వచ్చుచుండును. లావాదేవీలు వచ్చిన చాలా కాలము వరకు పరిష్కారము కావు.

విద్యార్థులకు ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణత కల్గును. ఇంకనూ ఉన్నతస్థాయిలందుకొందురు. నూతనోద్యోగ లాభములు, యత్నస్థానయోగములు కల్గును. రసాయన, వైద్య, సాంకేతిక యాంత్రిక వృత్తులవారికి ఉన్నత ఫలములు కల్గును. ఇంజనీర్లు, న్యాయవాద, సినీవృత్తుల వార్కి మధ్యమ ఫలితములుండును. వ్యాపారస్తులకు ఉన్నతస్థాయి కల్గును. ఇతరులను నమ్మరాదు. వ్యవసాయదారు

లకు అనుకూలము. మిర్చి, తైలము, అపరములు, స్టేషనరీ వ్యాపారులకు 8,9,11,12 మాసములు యోగించవు.

చిత్తవారు పగడము, నీలమణి ధరించుట మంచిది. స్వాతివారు గోమేధికము ముత్యము ధరించుట మంచిది. విశాఖవార్కి నీల పుష్యరాగము, జాతి పచ్చ యోగ్రపదము.

మొత్తము మీద ఈ రాశివార్కి మంచి ఫలితములేగల్గును. సంవత్సరమధ్యయందు అశాంతి ఆరోగ్య లోపము, అనిద్ర కల్గుచున్ననూ, శాంతిగ వుండును. రాహుకేతుగురు గ్రహముల జపశాంతులు జరుపుట వలన, గురు, శుక్రవార నియమములు, శ్రీ సుబ్రహ్మణ్య అభిషేకములు జరుపుటవలన యోగ్యప్రదముగ వుండును. ఈ రాశివార్కి అదృష్ట సంఖ్య 6 మరియు 8, స్త్రీలు లక్ష్మి, గణేశ పూజలు గురు వారములు చేయుట శాంతి దాయకము.

## వృశ్చికరాశి
### (విశాఖ 4వ పాదము, అనూరాధ, జ్యేష్ఠ)

ఆదాయం: 5 వ్యయం: 5 రాజపూజ్యం: 3 అవమానం: 3

ఈ రాశి వార్కి సంవత్సరమంతయు రాహువు జన్మమందు కేతువు సప్తమందు రజిత మూర్తులు. గురుడు అక్టోబరు 12 వరకు 11ట లోహమూర్తి. తదాది సంవత్సరమంతయు 12ట తామ్రమూర్తి. శని అక్టోబరు 15 వరకు రజితమూర్తి. అటు పిమ్మట నవంబరు 15వరకు 3ట (వక్రముచేత) లోహమూర్తి. తదాది సంవత్సరాంతము వరకు 4ట సువర్ణమూర్తి.

ఈ సంవత్సరం ఉత్తరార్థమందు గురుడు యోగ్యప్రదుడు. శని రాహుకేతువులు మధ్యమ ఫలములనిచ్చును. వీర్కి పట్టుదల అధికముగ వుండును. స్వలాభము కొరకు పాటు పడుచుందురు. కార్య విఘ్నములధికము. ఉదరము, నేత్రము, కంఠ ప్రదేశములందారోగ్య లోపములు కల్గుచుండును. ప్రతిపని యందు ఆసక్తి తక్కువ గల్గి ఆలస్యముగ నెరవేర్చుకొందురు. విదేశ, దూర ప్రయాణములనాశింతురు. మాతా పితృసేవలధికముగ చేయుదురు. ప్రతి పనియందనుమానములు హెచ్చుగవుండును. శరీర ఛాయ కొంచెము తగ్గివుందురు. దైవ కార్యముల రీత్యా ధన వ్యయము చేయుదురు. వాహన సౌఖ్యములు తక్కువ.

వ్యాపారస్తులు పెట్టుబడులు తగ్గించి మేలుకొనుట, జాయింటు దారులను, ఇతరులను నమ్ముట మంచిది కాదు. శుభ కార్యాదులు సంవత్సరము చివరయందు అనుకూలించును. భూగృహ నిర్మాణములు నిలచి వుండును. వ్యవహార చికాకులు అధికమగుచుండును. విద్యార్థులకు విద్యా విఘ్నములు కల్గుచుండును. దూరప్రాంతములందుండుట మంచిదికాదు. నవగ్రహ స్తోత్ర పఠనం మంచిది. కాంట్రాక్టులు, స్పెక్యులేషన్లు యోగించవు. యాంత్రిక, సాంకేతిక వృత్తి విద్యల వార్కి ఉన్నతావకాశములు సైన్సు గణితము వారికి మధ్యమము.

వ్యవసాయదారులకు శ్రమ మిగులును. మత్స్యములు, కోళ్ళ పరిశ్రమలవారికి మధ్యమ ఫలితములు. రసాయన, కలప, తైల, బంగారాది లోహములు అపరములు మిర్చి వ్యాపారస్తులకు గతము కంటే మేలు. న్యాయవాద చిత్ర పరిశ్రమలవారికి, ధాన్యము వ్యాపారులకు విశేషము.

విశాఖ వారు పుష్యరాగము ధరించుట విష్ణు సహస్రనామ పఠన చేయుట విశేషము. అనూరాధ వార్కి పగడము, నీలము ధరించిన అత్యుత్తమము ఆరోగ్యప్రదము. జ్యేష్ఠ వార్కి జాతి పచ్చ, కెంపు ధరించిన అధికారవృద్ధి ఆరోగ్యము కల్గును.

ఈ రాశివార్కి అదృష్టసంఖ్య 9 మరియు 2. వీర్కి 1,3,5,8,9 తేదీలు. సంఖ్యలు, సోమ, మంగళ, గురు శనివారములు యోగప్రదములు. మొత్తము మీద ఈ రాశివార్కి రాహు కేతు శని, కుజ గ్రహ జప శాంతులు, సుబ్రహ్మణ్యాష్టకము, అంగారక, ఈశ్వర సహస్ర నామములు చేయుటద్వారా అన్ని విధముల బాగుండును. వ్యవహార ఇబ్బందులు రావు. స్త్రీలు శుక్రవార నియమములు చేయుట, శ్రీ దుర్గా, నృసింహారాధనలు చేయుట రీత్యా కుటుంబ కలహములు తొలగి, పుత్రవృద్ధి కలుగును. సంతానసౌఖ్యము కల్గును.

## ధనూరాశి

### (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదము)

ఆదాయం: 8 వ్యయం: 11 రాజపూజ్యం: 6 అవమానం: 3

ఈ రాశి వార్కి గురుడు అక్టోబరు 12 వరకు 10ట సువర్ణమూర్తి. తదాది వత్సరాంతము వరకు 11ట రజిత మూర్తి. శని అక్టోబరు 15 వరకు 3ట తామ్రమూర్తి. తరువాత నవంబరు 9 వరకు వక్రముచే 12ట సువర్ణమూర్తి. తరువాత సంవత్సరాంతం వరకు 3ట తామ్రమూర్తి. రాహువు 12 ట, కేతువు 6ట సంవత్సరమంతయు సువర్ణమూర్తులు.

వీర్కి సంవత్సర పూర్వార్థమందు గురుడు శుభుడు. సత్కార్మలను విశేష కార్యములను చేయించును. వికాసవంతును చేయును. తరువాత లాభమందు గూడ కొంతవరకు మేలు చేయును. రాహు కేతువులు పూర్ణ యోగ ప్రదులు. ఈ రాశివార్కి నిరతాన్న దానము, స్వర్ణ మణిరత్న లాభము, మృష్టాన్న భోజనము, అన్నియు తెలసిన వానివలె నుండుట, కుటుంబ ఘనతలు చాటించుట, సంతాన అసౌఖ్యము, ఇతరులకు మేలు చేయుట మున్నగు లక్షణములుండును. మనస్సులోని కోరిక నెరవేరు వరకు నిద్రించకుండుట అధికార బలము, స్వజను బలము కల్గుచుండును. అక్టోబరు ప్రాంతములలో ఆర్థిక విధానములు మార్పు కల్గి వృద్ధి కల్గును. సంవత్సర ఉత్తరార్థమునందు ఆరోగ్య లోపములు, మిత్రులు శత్రువులుగ మారుట, మాట పిరికి తనము, అసూయాద్వేషములధికముగ వుండును. ఆర్థిక రాబడులు తగ్గును.

విద్యార్థులు ఉన్నత విద్యలనందగలరు. ప్రతిభావంతులగుదురు. ఉద్యోగాది స్థిరములు లభించును. అధికారులకు ఉన్నతస్థానములు కల్గును. యత్నబదిలీలు కల్గును. తిల తైల వ్యాపారములు, కలప, రసాయన వ్యాపారులకు 1,2,5,8,9,12,1 మాసములు విశేష లాభములు కలసి వచ్చును. కోళ్ళ పరిశ్రమలు, మత్స్య కళాకారులు, న్యాయ వాద వృత్తి వారలకు సంవత్సర మధ్యయందు అవాంతరములెదురగుచుండును. ధాన్యము, అపరములు, నిలువదారులకు వృద్ధి కల్గును. నూతన కోర్టు వ్యవహారము లెదురగుచుండును. సినీ, వైద్య వృత్తులవార్కి మధ్య మధ్య మంచి అవకాశములుండును. స్పెక్యులేషన్‌లు, షేర్లు, అనుకూలములు కావు.

మూల వారు వైఢూర్యము ధరించుట, శ్రీ రామచంద్ర, భ్రమరాంబాష్టకములు పఠించుట మేలు. పూర్వాషాఢవారు విఘ్నేశ్వర ఆరాధనలు చేయుట, రాహు కుజ గ్రహములు చేయించుట వలన మానసిక శారీరక రుగ్మతలు తొలగును. ఉత్తరాషాఢవారు కెంపు ధరించుట, గురు చంద్ర గ్రహముల జపశాంతులు సోమ వార నియమములు చేయుట వలన మంచి కల్గును.

ఈ రాశి వార్కి అదృష్ట సంఖ్య 3.

1,2,5,9 తేదీలు సంఖ్యలు, ఆది, సోమ, గురు శనివారములు యోగించును.

స్త్రీలకు నాగేంద్ర, ఆంజనేయ పూజలు సోమ వార నియమములు చేసిన కుటుంబమందు కళ్యాణాది శుభములు ఆర్థిక లాభము వృద్ధి కల్గును.

## మకరరాశి

### (ఉ.షా2,3,4 పాదములు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 2 అవమానం: 6

ఈ రాశి వార్కి అక్టోబరు 12 వరకు గురుడు 9ట రజిత మూర్తి, తదాది వత్సరాంతము వరకు 10 ట లోహమూర్తి. రాహువు 11ట, కేతువు 5ట సంవత్సరమంతయు లోహ మూర్తులు. శని అక్టోబరు 15 వరకు 2ట తామ్రమూర్తి. తరువాత నవంబరు 9 వరకు జన్మ మందు వక్రించి తామ్రమూర్తి. తరువాత వత్సరాంతము వరకు 2ట రజిత మూర్తి.

ఈ రాశి వార్కి గురుడు సంవత్సరం పూర్వార్థము పూర్ణయోగ ప్రదుడు. రాహుకేతువులు మధ్యమ ఫలము లిచ్చును. ఏల్నాటి శని వున్ననూ రాశ్యాధి పతి అగుట వలన యోగించును. గాని సంవత్సర మధ్యయందు వక్రమార్గ గతుడౌట వలన కుటుంబ భారములధికమగుట, అజాత శత్రు భీతి, మనోవ్యాకులత, పితృ ఆరోగ్య లోపము యత్న కార్య విఘ్నములు, కార్య విలంబనలు, వాత పిత్త ఆరోగ్యాది లోపములు, శస్త్ర బాధలు కల్గుచుండిననూ గురు వీక్షణము వలన కొద్ది మాత్రము శాంతి కల్గును. సంవత్సర ఉత్తరార్థము నందు పిత్రార్జిత ఆస్తి మార్పులు, సోదర ప్రేమగాని వ్యతిరేకత. దూరస్థాన చలన చింత, స్వర్ణ మణిరత్న లాభములు. అమృత మనోవాంఛ, ధర్మ కార్య ఆసక్తత, విరక్తతలు కల్గుచుండును. అప్పుడప్పుడు కటుంబమందు ఆరోగ్య మానసిక బాధలున్ననూ లెక్కలోనివి కావు.

తైలము, ఇనుము, కలప, బొగ్గు యంత్ర వ్యాపారులకు వ్యాపారములు నిదానము మీద, తక్కువ పెట్టుబడులు వలన కలసి వచ్చును. విద్యార్థులకు గతం కంటె మేలు. వైద్య, న్యాయ వాద సాంకేతిక విద్యల వార్కి సదవకాశములు, ప్రశంసలు కల్గును. మత్స్య, కోళ్ళు పత్రికల వార్కి, ధాన్య వ్యాపారులకు, స్టేషనరీ వ్యాపారులకు సామాన్య కాలము. ఉపాధ్యాయులు. ఉద్యోగులకు తమ కంటె క్రిందివారి సహకారములు కోరవలసి వచ్చుచుండును. వస్త్రములు, అపరములు, కిరాణా వడ్డీ వ్యాపారులకు వ్యత్యాస ఫలితములుండును.

ఉత్తరాషాఢ వారు కెంపు, జాతి పచ్చ ధరించుట మంచిది. శ్రవణ వారు ముత్యము, పగడము ధరించుట, శనీశ్వర, సూర్యగ్రహ జపశాంతులు, విశేషములు. ధనిష్టవారు మందేశ్వర స్వామి వార్కి తైలాభిషేకములు రుద్రాభిషేకములు చేయించుట, నీలమణి ముఖ్యముగ పుష్యరాగము ధరించుట అత్యావశ్యకము.

మొత్తము మీద ఈ రాశివార్కి సంవత్సర పూర్వార్థము అనుకూలంగనే వుండును. ఉత్తరార్థము నందు ఎంత దోషమున్ననూ దశమ శుభ గురుని వలననూ, ఈశ్వర, శనీశ్వర అభిషేకాదులు, శివ, విష్ణు సహస్ర నామ పఠనలు వలననూ శనీశ్వరుడు శాంతించి అన్ని విధముల కరుణించును. స్థిర భూగృహ సౌఖ్యములు కల్పించును. సదారోగ్యములు కల్గించును. సంతాన వృద్ధినిచ్చును. చిరకాలము నుండి సంతానము లేని వార్కి యోగించును. ఏదైననూ స్థిరములనొసగును. గాన శనిని దూషించరాదు.

## కుంభరాశి

(ధనిష్ఠ 3,4 పా. శతతార, పూర్వాభాద్ర 1,2,3 పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 2 అవమానం: 6

ఈ రాశి వార్కి శని అక్టోబరు 15 వరకు జన్మమందు సువర్ణ మూర్తి. తరువాత నవంబరు 9 వరకు రజిత మూర్తి. తదాది వత్సరాంతం వరకు జన్మమందు లోహమూర్తి. గురుడు అక్టోబరు 12 వరకు 8ట సువర్ణ మూర్తి. తదుపరి వత్సరాంతము వరకు 9ట తామ్రమూర్తి.

ఈ రాశి వారు అధికమైన పట్టుదల గలవారును, వ్యయ ప్రయాసలు లెక్కించని వారును, స్వజను విరోధములు, తరచు ఔషధ సేవలు చేయువారును, ఉన్నతాధికార మిత్రలాభము గల్గు వారును, ప్రయాణముల రీత్యా జంతు వాహన భయములు గల్గువారును, మ్లేచ్ఛుల వలన గౌరవము గల వారును, అకాల భోజనములు, మానసిక వ్యధలు అప్పుడప్పుడు గల్గుచువుందురు. ఏల్నాటి శని ప్రభావము దోషముగ వున్ననూ అక్టోబరు తరువాత గల్గు మధ్యమ గురుని బలము వలన కొంత వరకు శని యోగించి తద్వారా యత్న కార్యసిద్ధి, బుద్ధి మాంద్యము, ప్రతి పనియు ఆలస్యము, బద్ధకము, వ్యాకులతతో చేయుచుందురు. కుటుంబమందు మాట పట్టింపు లధికములగు చుండును. అక్టోబరు నవంబరు ప్రాంతములందు గల్గు శని వక్రము వలన అధికారులు, వ్యాపారులలో కొంత మంది యందు ఆకస్మిక మార్పులు, ఆకస్మికంగా మంచియే చెడుగా వర్తించడం, విశేషమైన మంచి కల్గుట, వృధా వ్యయము, పర గృహ వాసము, ప్రవాసాదులు అకాల భోజనములు చేయుట మున్నగు లక్షణములు గల్గి తదుపరి స్థాన బలము లేర్పరచుకొనుచు వృద్ధి చెందుదురు.

జాయింటు వ్యాపారములు తగ్గించుట మేలు. ప్రతి వ్యవహారములందు తల దూర్చుట మంచిది కాదు. స్వంత పనుల కంటె ఇతరులకు మేలు కల్గుచుండును, గాని అవమానాదులు కల్గు సూచనలున్నవి. కొద్ది మంది వ్యాపారులకు విశేష లాభములు. భూగృహస్థిర వసతులు శుభాదులు కల్గుచుండును. సిమ్మెంటు, ఇనుము, తైల వ్యాపారులకు విశేష కాలము.

విద్యార్థులకు రెండవ చాన్సు మేలు. సైన్సు, సాంకేతిక విద్యలవార్కి కొంత వరకు యోగ కాలము. ఉపాధ్యాయ వృత్తి, ఉద్యోగస్తులకు గతం కంటె మేలు. ప్రజాదరణములు, ప్రశంసలు గల్గును.

వ్యాపారస్తులకు 6,7,8,11,1,2 నెలలంతగ యోగించవు. రైస్ మిల్లర్లు, కోళ్ళు, మత్స్య వ్యాపారులకు రసాయనికి వ్యాపారులకు 4,6,7,9,10,12,3 నెలలందు విశేష లాభములు కలసి వచ్చును. స్వయం వృత్తుల, వ్యాపారులకు కొంతవరకు గుర్తింపులు కల్గుచుండును. వ్యవసాయదారులకు సామాన్యము. స్పెక్యులేషన్‌లు, షేర్సు యోగించవు.

ధనిష్ఠ వారు పగడము ధరించుట, శ్రీరామ చంద్ర పూజలు, ఈశ్వరాభిషేకములు, శని గ్రహ జప, తైలాభిషేకాదులు చేసుకొనిన మొత్తం మీద ఈ రాశి వారిలో వీర్కి శని దోషము గలదు.

శత తార వారు గోమేధికము ధరించుటవలన నీలమణిని ధరించుట వలన రాహుకేతు గ్రహ జపములు చేయించు కొనుట వలన కళత్ర, మాతృ, పుత్ర, ఆరోగ్యములు బాగుండును. పూ.భా. వారు పుష్యరాగము ధరించుట మంచిది.

మొత్తము మీద ఈ రాశి వార్కి ఏల్నాటి శనిలో 2వ భాగము వున్ననూ స్వ స్థానాధిపత్యము, క్షేత్ర స్థితి కల్గుట దోషము అయిననూ అక్టోబరు తరువాత కొంత వరకు గురుబలము వలన యోగించును. 4,5,6,8,12,1 నెలలు గాక మిగిలిన మాసములు యోగ ప్రదములుగ వుండును. వివాహాది శుభ యత్నములు సంవత్సర ప్రారంభము, చివరలందనుకూలించును. భూగృహ నిర్మాణ యోగములు, జాగ్రత్తతో మెలగవలెను.

వీర్కి అదృష్ట సంఖ్య 8. మరియు 3,5,6,8 తేదీలు, సంఖ్యలు అంగారక, బుధ, శుక్ర వారములు యోగప్రదములు. శనీశ్వర తైలాభిషేకములు, నీలమణి ధారణ, రుద్రాభిషేకములు, శివాలయ ప్రదక్షిణలు చేయుట అత్యంత ఉత్తమము. ఋణములు తొలగి ధన ఆరోగ్యములకు లోటు రాదు.

## మీనరాశి

(పూ.భా. 4వ పాదము, ఉ.భా. రేవతి)

ఆదాయం: 8 వ్యయం: 11 రాజపూజ్యం: 1 అవమానం: 2

ఈ రాశి వార్కి గురుడు అక్టోబరు 12 వరకు 7ట లోహమూర్తి. తదాది వత్సరాంతం వరకు 8ట సువర్ణమూర్తి. శని అక్టోబరు 15 వరకు వ్యయమందు రజిత మూర్తి. తరువాత నవంబరు 9 వరకు వక్రముచే 11ట లోహమూర్తి. తదాది వత్సరాంతం వరకు వ్యయమందు తామ్రమూర్తి.

ఈ రాశి వార్కి గురుడు సప్తమస్థితి ద్వారా అక్టోబరు వరకు కొంత యోగప్రదుడు. తరువాత అష్టమ స్థితి దోషమయిననూ మూర్తిమంతం రీత్యా కొంత వరకు యోగించును. రాహుకేతువులు సామాన్య వృద్ధి. పిరికితనము, శతృత్వవృద్ధి. ఆర్థిక వృద్ధి. లోభత్వములకు పితృస్థాన హానియును చేయుదురు. ఏల్నాటి శని 93 మార్చి 5 నుండి ప్రారంభమగుట వలన ఈ ప్రారంభ కాలమందు ఒక పర్యాయము మాత్రము జప, తైలాభిషేక దానాదులు, హోమాదులు ఆచరించుట వలన దోషములను తగ్గించును. ఈ రాశి వార్కి సంఘములో గౌరవములు, అధికారములు, చికాకులు, అధిక తెలివి, వ్యయ ప్రయాసాదులు, ఉదరము, లింగసూచిక స్థానమ్ము, మోకాళ్ళు మున్నగు ఆరోగ్య లోపములు, వాత తత్త్వములు అధికముగా వుండును. 5,6,8,9,10,3 మాసములందు భావుక సోదర

వైరములు, అధికార వత్తిడులు, అసంఘటనలు, కఠిన సంభాషణలద్వారా గౌరవాదులు, ఔషధ సేవలు ధనవంతులైన క్రూర మనస్తత్వములు, అన్నియు తెలిసిన వారివలె నుండుట, మున్నగు లక్షణములుండును.

విద్యార్థులకు ఆంగ్లము, తెనుగు, గణితము లందధిక శ్రద్ధగల్గిన గాని ఉత్తీర్ణత కాలేరు. సైన్సు, భూగోళ శాఖలు, అధ్యయనము చేయువారికి ఉన్నత స్థానములందుకొన గలరు. సంవత్సర ఉత్తరార్థమందు నూతనోద్యోగములందుకొందురు. ఉపాధ్యాయ, ఉద్యోగ శాఖల వార్కి వత్తిడులు, అధికార పర్యటనలు అసంతృప్తి కల్గుచుండును. అయిననూ చెడు కలుగదు. స్వయం వృత్తుల అధికారులు, వ్యాపార శాఖల వార్కి మొత్తం మీద జాగ్రత్త పడుటే మేలు. వ్యాపారస్తులకు జాయింటులను కూలములు కావు. పెట్టుబడులు తగ్గించి వ్యాపారములు చేయుట మంచిది. నూతన వ్యాపారములు నిదానించి ప్రారంభము చేయుట మేలగును. షేర్లు, స్పెక్యులేషన్‌లు కొంతవరకు లాభించును. ధాన్యము, కలప, అపరములు, స్టేషనరీ వస్త్ర వ్యాపారులకు 8,9,11,12,1 నెలలు యోగములు కావు. బంగారాది వ్యాపారులకు విశేషము.

పూ.భా. వారు పుష్యరాగము ధరించుట మంచిది. విష్ణు సహస్ర నామావళి, హనుమద్ధ్యానము చేయుట మంచిది. ఉత్తరా భాద్ర వారు నీలమణి ధరించుట మంచిది. రేవతి వారు పచ్చ ధరించుట మంచిది.

ఈ రాశి వార్కి అదృష్ట సంఖ్య 3,1,2,8,9 తేదీలు, సంఖ్యలు ఆదిత్య చంద్ర అంగారక వారములు కలసిన యోగప్రదములు.

ఈ రాశి వార్కి శనీశ్వర రుద్రాభిషేకములు, శివలింగ దర్శనములు, గణేశ్వర, రాజేశ్వరాది పూజలు చేయుట వలన యోగ ప్రదము. కళ్యాణాదులు మంగళ ప్రదములగును.

* * *



## శుభముహూర్తముల సందర్భము

ఇందు బహుళముగ శుభముహూర్తములను నిర్ణయించి వ్రాసితిని. ఇందు వ్రాయబడిన వానికి స్వల్ప దోషములున్నను వాటికి పరిహారములను గమనించియే వ్రాయబడినవి. ఏకవింశతి మహా దోషములు, ఉపదోషములు, మీన, చైత్ర, లత్తా, వేధలు మున్నగు వాటికిని దేశవ్యవస్థలను గమనించి వ్రాయబడినవి. కేవలము నిర్దుష్టమగు లగ్నములు సంవత్సరమునకు 3,4, గూడ దొరకుట కష్టము. సుప్రసిద్ధ సిద్ధాంతులును చిరకాలమునుండి గుణదోషములను నిరూపణ చేయుటయు వ్రాయుటగలదు. మరియు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగించుకొనుటకు కొంతవరకు ముహూర్తములు వ్రాయబడినవి. సహృదయులు వాటిని గమనించి క్షీరనీర న్యాయముగ గ్రహించి ఆచరణ యోగ్యములగు వాటిని ప్రజలకు అందచేయవలసినదిగా మనవి చేయుచున్నాను.

-- పంచాంగకర్త.

## శుభముహూర్తాని

### చైత్రమాసః (24-3-93 నుండి 21-4-93 వరకు)

మార్చి 24 శు. ప్రతి. బుధ. రేవతి నవవస్త్రాభరణధారణ, రాజదర్శనాదీనాం వృషభోర ఉ.గం. 10-9

25 గురు. విదియ. అశ్విని. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ యాత్రా క్రయ విక్రయాదీనాం మేషోర ఉ.గం. 8-33

28 ఆది. పంచమి. రోహిణి. డోలారోహణస్య కర్కాటకోర ప.గం. 1-35

ఏప్రిల్ 1 గురు. నవమి. పుష్యమి డోలారోహణస్య కర్కాటకో మతాంర ప.గం. 1-21

2 శుక్ర. దశమి. పుష్యమి. అన్నప్రాశనస్య మేషోర ఉ.గం. 8-02

8 గురు. బ. విదియ. స్వాతి. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార వివాహక్రయవిక్రయాదీనాం వృషభోమతాంర ఉ.గం. 9-07 (లగ్న కేతుః, 7 రాహుః)

10 శని. చవితి. అనూరాధ. డోలారోహణక్రయవిక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 12-46, వివాహ గర్భాదానాదీనాం తులార రా.గం. 8-23

13 మంగళ. సప్తమి. ఉ.షా. వివాహస్య మీనోర తె.గం. 4-53

16 శుక్ర. దశమి శత. వివాహస్య మీనోర తె.గం. 4-39

### వైశాఖమాసః (22-4-93 నుండి 21-5-93 వరకు)

ఏప్రిల్ 25 ఆది. శు. తదియ. మృగశిర. నూతన గృహారంభప్రవేశకూపారంభాదీనాం మీనోర తె.గం. 4-04

26 సోమ. చవితి. మృగశిర. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార గృహారంభప్రవేశ యాత్రాక్రయవిక్రయాదీనాం మిధునోమతాంర ఉ.గం. 10-45

28 బుధ. సప్తమి. పునర్వసు. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార క్రయవిక్రయాదీనాం మిధునోర ఉ.గం. 10-37, డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యామతాంర సా.గం. 4-22, పుష్యమి. నూతన గృహారంభ ప్రవేశ కూపారంభాదీనాం మీనోర తె.గం. 3-53

మే 2 ఆది. ఏకాదశి. ఉ.ఫ. వివాహ, గృహప్రవేశ నిషేకాదీనాం ధనూర. రాత్రి 11-06.

5 బుధ. చతు. స్వాతి. అన్నప్రాశన వివాహ గృహారంభాదీనాం మిధునోర ఉ.గం. 10-10

7 శుక్ర. కృ. ప్రతి. అనూరాధ. డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యామతాంర ప.గం. 3-48

9 ఆది. చవితి. మూల. అన్నప్రాశనోపనయన వివాహగృహారంభ క్రయవిక్రయాదీనాం మిధునోర ఉ.గం. 9-55.

12 బుధ. సప్తమి. శ్రవణం. డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 3-28

14 శుక్ర. అష్టమి. శతభిషం. డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 3-22, వివాహస్య మీనోర రా.గం. 2-54

## జ్యేష్ఠ మాసః (22-5-93 నుండి 20-6-93 వరకు)

23 ఆది. శు. విదియ. మృగశిర. డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 2-46, వివాహస్య మీనోర రా.గం. 2-17

26 బుధ. పంచమి. పుష్యమి. డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 2-34

27 గురు. షష్ఠి. మఘ. వివాహస్య మీనోమతాంర రా.గం. 2-01, మేషోపి తె.గం. 4-29

29 శని. అష్టమి. ఉత్తర. వివాహ గృహప్రవేశాదీనాం మీనోర రా.గం. 1-54

30 ఆది. దశమి. ఉత్తర. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార వివాహక్రయవిక్రయాదీనాం మిధునం మతాంర ఉ.గం. 8-35

జూన్ 6 ఆది. బ. విదియ. మూల. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార వివాహక్రయవిక్రయాదీనాం మిధునంర ఉ.గం. 8-06

8 మంగళ. చవితి. శ్రవణ. వివాహస్య మేషోర రా.గం. 3-42

9 బుధ. పంచమి. ధనిష్ఠ. డోలారోహణక్రయవిక్రయాదీనాం తులార సా.గం. 4-30

10 గురు. షష్ఠి. శతభిషం. వివాహగర్భాదానాదీనాం ధనూర రా.గం. 8-36 (8 కుజః) వివాహస్య మీనోమతాంర. రా.గం. 1-07

13 ఆది. నవమి. ఉ.భా. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార వివాహక్రయవిక్రయా దీనాం మిధునోర ఉ.గం. 7-42, డోలారోహణ క్రయవిక్రయాదీనాం కన్యామతాంర ప.గం. 1-26, వివాహస్య మీనోర రా.గం. 12-54

## ఆషాఢ మాసః (21-6-93 నుండి 19-7-93 వరకు)

జూన్ 26 శని. శు. సప్తమి. ఉత్తర. అన్నప్రాశనస్య కర్కాటక ఉ.గం. 7-47

29 మంగళ. దశమి. స్వాతి. -- కర్కాటకోర ఉ.గం. 7-34

జూలై 3 శని. పూర్ణిమ. మూల. డోలారోహణస్య తులార ప.గం. 2-58

7 బుధ. బ. చవితి. ధనిష్ఠ. అన్నప్రాశనస్య కర్కాటకో మతాంర ఉ.గం. 7-02

11 ఆది. సప్తమి. రేవతి. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 11-35

12 సోమ. అష్టమి. రేవతి. అన్నప్రాశనస్య కర్కాటకోర ఉ.గం. 6-44, అశ్విని డోలారోహణస్యతులార ప.గం. 2-23

## శ్రావణ మాసః (20-7-93 నుండి 17-8-93 వరకు)

జూలై 23 శుక్ర. శు. చవితి. ఉత్తర. డోలారోహణక్రయవిక్రయాదీనాం ధనూర సా.గం.5-49, వివాహగర్భాదాన గృహప్రవేశాదీనాం మీనోమతాంర రా.గం. 10-22, వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మిధునోర తె.గం. 5-02

24 శని. షష్ఠి. హస్త. డోలారోహణ క్రయవిక్రయాదీనాం తులామతాంర ప.గం. 1-36, వివాహగృహారంభాదీనాం మిధునోర తె.గం. 4-58

25 ఆది. సప్తమి. చిత్త. గృహారంభప్రవేశాదీనాం మిధునోర తె.గం. 4-54

26 సోమ. అష్టమి. స్వాతి. డోలారోహణక్రయవిక్రయాదీనాం ధనూర సా.గం. 5-36

28 బుధ. దశమి. అనూరాధ. వివాహగర్భాధాన గృహప్రవేశాదీనాం మీనో వసుః రా.గం. 10-01, వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మిధునోర తె.గం. 4-44

29 గురు. ఏకాదశి. మూల వివాహగృహారంభయోః మిధునమతాంర తె.గం. 4-39

30 శుక్ర. ద్వాదశి. మూల. అన్నప్రాశన వివాహగృహారంభ క్రయవిక్రయాదీనాం కన్యార ఉ.గం. 10-22 వివాహస్య మీనోర రా.గం. 9-53

ఆగష్టు 1 ఆది. చతు. ఉ.షా. అన్నప్రాశన వివాహగృహారంభ ప్రవేశాదీనాం కన్యాచోరః ఉ.గం. 10-13

3 మంగళ. బ. పాడ్యమి. ధనిష్ఠ. వివాహగృహారంభ ప్రవేశాదీనాం మిధునోర తె.గం. 4-19

4 బుధ. విదియ. శతభిషం. వివాహగృహారంభ ప్రవేశాదీనాం మిధునోర తె.గం. 4-15

6 శుక్ర. చవితి. ఉ.భా. వివాహగృహారంభ ప్రవేశాదీనాం మిధునోర తె.గం. 4-08

8 ఆది. షష్ఠి. అశ్విని. నూతన గృహారంభస్య మిధునమతాంర తె.గం. 3-59

## అధికభాద్రపద మాసః (18-8-93 నుండి 16-9-93 వరకు)

ఆగష్టు 20 శుక్ర. శు. తదియ. ఉత్తర. డోలారోహణస్య ధనూర ప.గం. 3-55

22 ఆది. పంచమి, చిత్త. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 11-40

28 శని. ద్వాదశి. ఉ.షా. డోలారోహణస్య మకరోర సా.గం. 4-54

29 ఆది. త్రయోదశి. శ్రవణ. అన్నప్రాశనస్య తులాచోరః ఉ.గం. 11-11

సెప్టెంబరు 1 బుధ. పూర్ణిమ. శతభిషం. అన్నప్రాశనస్య తులార ఉ.గం. 11-0 డోలారోహణస్య మకరోర సా.గం. 4-39

## నిజభాద్రపదమాసః (17-9-93 నుండి 15-10-93 వరకు)

18 శని. శు. పాడ్యమి. చిత్త. డోలారోహణస్య మకరోర ప.గం. 3-30

19 ఆది. విదియ. స్వాతి. డోలారోహణస్య మకరోర ప.గం. 3-26

25 శని. దశమి. ఉ.షా. డోలారోహణస్య మకరోర ప.గం. 3-0

## ఆశ్వయుజమాసః (16-10-93 నుండి 13-11-93 వరకు)

అక్టో. 20 బుధ. శు. పంచమి. మూల. డోలారోహణస్య కుంభోర ప.గం. 3-38 మీనోర ప. గం. 4-21

24 ఆది. నవమి. ధనిష్ఠ అన్నప్రాశనస్య ధనూర ఉ.గం. 11-32, డోలారోహణ క్రయవిక్రయాదీనాం కుంభోర ప.గం. 3-21, విజయ ముహూర్తకాలః ప.గం. 2-02

29 శుక్ర. చతు. రేవతి. డోలారోహణస్య మీనోర ప.గం. 3-43

నవంబరు 3 బుధ. నవమి. మృగశిర. అన్నప్రాశనవైశ్యోపనయన వివాహగృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం ధనుర్మతాంతర ఉ.గం. 10-52. డోలారోహణస్య మీనోర ప.గం. 3-24. వివాహగర్భాధాన గృహప్రవేశాదీనాం మిధునమతాంర రా.గం. 10-07

5 శుక్ర. షష్ఠి. పుష్యమి. గృహప్రవేశస్య సింహోర రా.గం. 2-05

## కార్తీక మాసః (14-11-93 నుండి 13-12-93 వరకు)

నవంబరు 15 సోమ. శు. విదియ. అనూరాధ. అన్నప్రాశనవైశ్యోపనయన నూతన వ్యాపారాదీనాం ధనూర ఉ.గం. 10-4

18 గురు. పంచమి. ఉ.షా. డోలారోహణక్రయవిక్రయాదీనాం మేషోర సా.గం. 4-51, వివాహగృహారంభ ప్రవేశాదీనాం కన్యార రా.గం. 2-55, వివాహగృహారంభా దీనాం తులామతాంర తె.గం. 5-45

19 శుక్ర. షష్ఠి. శ్రవణం. వివాహగృహారంభాదీనాం కన్యామతాంర రా.గం. 3-0 తులాపి బలీ తె.గం. 5-41

20 శని. సప్తమి. శ్రవణం. అన్నప్రాశనవైశ్యోపనయన వివాహగృహారంభయాత్రాక్రయ విక్రయాదీనాం ధనూర ఉ.గం. 8-43, ధనిష్ఠ వివాహగృహారంభాదీనాం తులార తె.గం. 5-35

21 ఆది. అష్టమి. ధనిష్ఠ. అన్నప్రాశన వివాహ గృహారంభాదీనాం మకరశ్శోరోపిబలీ ఉ.గం. 11-11

22 సోమ. నవమి. శతభిషం. అన్నప్రాశనవైశ్యోపనయనగృహారంభాదీనాం మకరోర ఉ.గం. 11-08

24 బుధ. ఏకాదశి. ఉ.భా. అన్నప్రాశన వివాహగృహారంభ ప్రవేశాదీనాం ధనూర ఉ.గం. 9-28. రేవతి వివాహస్య మిథునోర రా.గం. 8-44 వివాహ గృహప్రవేశాదీనాం కన్యామతాంర రా.గం. 2-30, వివాహ గృహారంభాదీనాం తులామతాంర తె.గం. 5-22

25 గురు. ద్వాదశి. రేవతి. వివాహగృహారంభాదీనాం తులామతాంర తె.గం. 5-16

30 మంగళ. బ. పాడ్యమి. మృగశిర. వివాహగృహారంభాదీనాం తులార తె.గం. 4-58

డిశెంబరు 1 బుధ. విదియ. ఆర్ద్ర. గర్భాదానస్య మిథునోర రా.గం. 8-15

3 శుక్ర. చవితి. పుష్యమి. నూతనగృహారంభస్య తులార తె.గం. 4-44

8 బుధ. దశమి. హస్త. అన్నప్రాశనవైశ్యోపనయన వివాహ గృహారంభ క్రయ విక్రయాదీనాం ధనూర ఉ.గం. 8-32, వివాహగర్భాదానయోః మిథునోర రా.గం. 7-47

## మార్గశిరమాసః (14-12-93 నుండి 11-1-94 వరకు)

డిశెంబరు 17 శుక్ర. చవితి. శ్రవణ. డోలారోహణస్య మేషోర ప.గం. 2-57

19 ఆది. షష్ఠి. శతభిషం. అన్నప్రాశనస్యమకరోర ఉ.గం. 9-22. డోలారోహణస్యమేషో మతాంర ప.గం. 2-51

22 బుధ. నవమి. రేవతి. అన్నప్రాశనస్య మకరోర ఉ.గం. 9-10

## పుష్యమాసః (12-1-94 నుండి 10-2-94 వరకు)

జనవరి 19 బుధ. శు. సప్తమి. రేవతి. అన్నప్రాశనస్య మీనే శుభనవాంశకాలః ఉ.గం. 10-40

31 సోమ. బ. చవితి. ఉత్తర. అన్నప్రాశనస్య మీనోర ఉ.గం. 9-35

## మాఘమాసః (11-2-94 నుండి 12-3-94 వరకు)

ఫిబ్రవరి 12 శని. శు. విదియ. శతభిషం. అన్నప్రాశనస్య మేషోర ఉ.గం. 11-14

14 సోమ. చవితి. ఉ.భా. అన్నప్రాశనస్యమేషశ్చోరః ఉ.గం. 11-6

16 బుధ. షష్ఠి. అశ్విని. అన్నప్రాశనస్య మేషోర ఉ.గం. 10-58. డోలారోహణస్య మిధునోర ప.గం. 3-14

25 శుక్ర. చతు. మఘ. వివాహస్య మేషోర ఉ.గం. 10-24. వివాహస్య తులార రా.గం. 3-25

27 ఆది. బ. విదియ. ఉత్తర. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార వివాహగృహారంభ ప్రవేశాదీనాం మీనోర ఉ.గం. 7-48 మేషోపిర ఉ.గం. 10-16. వివాహ గర్భాదాన గృహప్రవేశాదీనాం కన్యార రా.గం. 8-17. వివాహ గృహారంభ ప్రవేశాదీనాం ధనూర రా.గం. 3-21. వివాహగృహారంభాదీనాంమకరోర తె.గం. 4-48

28 సోమ. తదియ. హస్త. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార గృహారంభాదీనాం మీనోర ఉ. గం. 7-44. గర్భాదానస్య తులార రా.గం. 11-06

మార్చి 1 మంగళ. చవితి. స్వాతి. వివాహ గృహారంభాదీనాం మకరోర తె.గం. 4-39

2 బుధ. పంచమి. స్వాతి. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార వివాహగృహారంభక్రయ విక్రయాదీనాం మేషోర ఉ.గం. 10-04. వివాహగర్భాధానయోః తులార రా.గం. 10-56

6 ఆది. నవమి. మూల. అన్నప్రాశనోపనయన వివాహగృహారంభాదీనాం మీనోర ఉ.గం. 7-22 మేషోపి బలీ ఉ.గం. 9-49. డోలారోహణస్య మిధునోర ప.గం. 2-05

## ఫాల్గుణమాసః (13-3-94 నుండి 10-4-94 వరకు)

మార్చి 14 సోమ. శు. విదియ. రేవతి. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార క్రయవిక్రయాదీనాం మీనోర ఉ.గం. 6-50 మేషోపిబలీ ఉ.గం. 9-17

19 శని. సప్తమి. మృగశిర. వివాహగృహారంభాదీనాం మకరశ్చోరోపిబలీ రా.గం. 3-28

22 మంగళ. దశమి. పునర్వసు. క్రయవిక్రయాదీనాం మిధునోర ప.గం. 1-02

23 బుధ. ఏకాదశి. పుష్యమి. అన్నప్రాశనోపనయన విద్యారంభగృహారంభ క్రయవిక్రయా దీనాం మేషశ్చోరః ఉ.గం. 8-42

24 గురు. ద్వాదశి. మఘ. వివాహస్య తులార. రా.గం. 9-30

